# అవతారిక.

లోకంబున మానవులకు పరమార్థమనఁగా ధర్మార్థకామములకంటె పరమైన మోక్షమని యర్థము. అట్టిమోక్షము కొరకే మానవులనేక పుణ్యకార్యములు చేయుచున్నారు. మోక్షమనఁగా జీవుఁడు దేవుఁడగుటకంటె వేరుగాదు. తన్నుతానెఱిఁగిన జీవుఁడు దేవుఁడగుచున్నాఁడు. దైవానుగ్రహమువలనగాని తన్నుతానెరుఁగ శక్యముగాదు. మాయను జయించిన మహాశూరుఁడుగాని పరబ్రహ్మమును దర్శింపనేరఁడు. సర్వసంగపరిత్యాగికాని మాయను జయింపఁజాలఁడు. సర్వభోగ సంతుష్టునకుఁగాని విషయాశ విడువనేరదు. అనేక జన్మతపస్సిద్ధివలనఁగాని సర్వభోగసంతుష్టి కలుగనేరదు. అట్టిసమర్థుఁడుగాని బ్రహ్మవిద్యకధికారి కానేరడు. అట్టిపూర్ణాధికారులకే బ్రహ్మవిద్య యేర్పడియున్నది. అట్టియధికారి యొక్కఁడే మోక్షసామ్రాజ్యమును బొందుచున్నాఁడు. ఇదియే పరమార్థరహస్యమని జగత్ప్రసిద్ధమై యున్నది.

పరమార్థరహస్య మిట్లుండఁగా'' శ్లో॥ కలౌవే
దాంతినస్సర్వే। శిశ్నోదర పరాయణాః। కలౌ
పంచసహస్రాణి। జాయతే వర్ణసంకరః॥ " అ
నినట్లు కలియుగంబున మానవులు కర్మభక్తి జ్ఞా
నానుష్ఠానంబులు.వర్జించి వేదాంతమను వెఱ్ఱిభ్ర
మజెంది అచలపరిపూర్ణుఁ డైతిమని భగవంతుని
నామమైనను స్మరింపక నాస్తికులై, నరకంబున
కరుగుటంజూచి భక్తవత్సలుండైన భగవంతుఁ
డు సద్గురురూపంబున బ్రసన్నుండై ''కలౌస్మ
రణాన్ముక్తిః। నాస్తిసాధన మన్యథా॥ " అని
నిజభక్తుల కుపదేశించియుండుటవలన ముము
క్షువులకు నీతిమొదటిసాధనమనిన్ని భక్తి
డవ సాధనమనిన్ని జ్ఞానము మూడవ సాధనమ
నిన్ని నిశ్చయించి యీగ్రంథమందు మొదట
నీతిమార్గము జీవరహస్య మనిన్ని, భక్తిమా
ర్గము దేవరహస్యమనిన్ని జ్ఞానమార్గము గు
రురహస్యమనిన్ని మూడు ప్రకరణములుగా వి
వరింపబడుచున్నది. గనుక యీగ్రంథము పర
మార్థబాలబోధ యని సార్థకనామము వహించి
ముముక్షుజనకల్ప వృక్షంబై లోకంబున నుద్భ
వించుచున్నదని తాత్పర్యము.



శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః.

# పరమార్థబాలబోధ

## జీవరహస్యము.

శ్లో. దుర్లభో మానుషో దేహో
దేహినాం క్షణభంగురః
తత్రాపి దుర్లభం మన్యే
వైకుంఠప్రియ దర్శనః.

అనగా లోకంబున జీవులకు మానవజన్మ లభించుటయే మహాపుణ్యమనిన్ని, యిట్టిపుణ్య జన్మ లభించినందుకు జీవుడు దేవుని దర్శించుటయే జన్మసాఫల్యమనిన్ని మానవ జన్మమునకాయుష్కాలము శతవర్షములైనను క్షణమాత్రములో మృతిజెందుననిన్ని, తనయాయుష్కాలములో క్షణకాలము మాత్రమే జీవునియధీనమై తక్కినకాలము దేవుని స్వాధీనములో

నుంమననిన్ని, అష్టైశ్వర్యముల కంటెను ఆయు ర్భాగ్యమే మహాభాగ్యమనిన్ని, అట్టిమహాదై శ్వర్యమయిన తనజీవితకాలములో ప్రతిక్షణ కాలమును దేవునికొరకు వినియోగించి దేవుని దర్శించవలశినదనిన్ని, యిట్లు దేవునిదర్శించు టకే యీమానవజన్మ మేర్పడినదనిన్ని, ఇట్లు దేవునిదర్శించని జన్మముద్విపాదపశుజన్మమనిన్ని మానవులకు తెలియబడుచున్న విషయమేఅయ్యె న్నది. గనుక యిది సకలవేదరహస్యములలోను పరమరహస్యమని చెప్పబడుచున్నది.

మఱియు—

శ్లో. శ్రుతిస్మృతి మమైవాజ్ఞా
యస్తేనుల్లంఘ్యవర్తతే
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ
సపథ్యో నాత్రిసంశయః.

అనగా లోకంబున వివేకశక్తిగల మానవ కోటికి వేదశాస్త్రపురాణంబులు యీశ్వరశాస నంబులై యేర్పడి యున్నందున మానవులు యీశ్వరాజ్ఞల ననుసరించి భయభక్తి విశ్వాస ములతో ప్రవర్తించవలసినదనిన్ని, యేజీవులు

యీశ్వరాజ్ఞ నతిక్రమించి వర్తింతురో వారిని యీశ్వరశాసనమే యమదండనమై శిక్షించు నన్నియు, గ్రహించి యమునియందు భయము న్నూ దేవునియందు భక్తిన్ని, కలిగి వర్తించునది సర్వధర్మములలోను పరమధర్మమనిన్నీ మానవు లకు తెలియబడుచున్న విషయమె అయ్యున్నది

లోకంబున మానవులకు యీశ్వరశాసన మిట్లు విధించి యుండగా, మానవులప్రవర్తన మెట్లుండవలసినది ? తల్లిదండ్రుల యాజ్ఞను తప్పక ప్రవర్తించు సత్పుత్రులవలె సర్వజను లును సత్యంవద" ధర్మంచరా' యను జగత్ప్రభు శాసనము ననుసరించి ధర్మమార్గమున వర్తిం చుటకు బదులు యీశ్వరాజ్ఞ నతిక్రమించి అధ ర్మవర్తనులై జీవించుచున్నారుగదా ?

అదిగాక జగజ్జనకుండైన దేవుండు తనప్రి యపుత్రులైన మానవులకు సకలైశ్వర్య సంప దలను గల్పించి సకలసౌఖ్యములను పొందించు చుండగా మీరు సకలభోగములను పొందునపు డు దేవుని ప్రేమతో దలంచి భగవదర్పణముగా ననుభవించుటకు బదులు దైవాధీనంబులైన దే

శకాలవస్తువులను మీస్వార్జితవస్తువులుగాయెంచుకొని కొంచమైనను పరుల కుపకరింపక పరమలోభులై బ్రతుకు చున్నారుగదా ?

అదిగాక జగత్కర్తయైన దేవుండు జగన్నాటక వినోదంబైన తన సృష్టివైచిత్రియమును మీకన్నులకు మహాద్భుతముగా జూపించి యిటువంటి చిత్రవిచిత్ర లీలావినోదంబును గల్పించిన సర్వజ్ఞుండెంతవాడో మనకన్నుల కగుపించకున్నాడని మీలోపలనేయుండి మీకుతోపించుచుండినను మీయంతరంగమునందున్న అంతరాత్ముని రవంతైనను విచారింపక దేవుడున్నాడో లేడో యని పరిహాసింపుచు కష్టముగలిగినప్పుడు మాత్రము దిక్కుమాలినదేవుడు మమ్ములనిట్లు పుట్టించి చిక్కులు బెట్టుచున్నాడని రన్నియముగా నిందించుచున్నారుగదా ?

అదిగాక జగద్రక్షకుండైన దేవుండు మీరు తల్లిగర్భమునందుండునపుడు మీకేయుపాయమును రాకుండునట్లు కన్నతల్లివలె కాపాడుచు దినప్రళయముమొదలు తనుప్రళయమువరకు మీకు వ్యాతి జెందకుండునట్లు మిమ్ములి రక్షిం

వుచు వీరాఱు గర్భనరకము సహింపలేమనిప్రా
ర్థించిన మిమ్ములను గర్భగోళమునుండి బయలు
వెడలించినప్పుడుగదా మీజీవితంబులును మీ
శరీరత్వంబులును గనుపించుచున్నవి ? అట్టివి
వయములో మీరు దేవునిమఱచి మీరే స్వతం
త్రులై నేను మహాప్రభువును, నేనుమహాశూరు
డను, నేనుమహాభోగిని, నేను శ్రీమంతుడను
నేనుసార్వభౌముడను. అని స్వాతిశయంబున మ
దోన్మత్తులై యొకరినొకరు హింసింపుచు యొక
రి రాజ్యము నొకరపహరించి పరస్పరవిరోధులై
[illegible]మును భుజించి పాడుదేహమును పెంచు
కొనుచున్నారుగదా ?

అదిగాక జగత్ప్రభువైన దేవుండుసర్వాంత
ర్యామియై మీహృదయములోనుండి మీరుచే
యుచున్న ప్రతిదుష్కార్యమును కనిపెట్టి యిది
ద్రోహము యిదిపాపము యిదిమోసము యిది
దూష్యము యిదినరకముయిదిక్రూరము యిది
హింస అని మీమనస్సాక్షియై మీకుతోపించు
చుండినను కొంచమయినను సంశయించక పాప
మెక్కడ పుణ్యమెక్కడ యనుచుఁడెక్కడ దేము

డెకృష నేమిలేదని యెగరగొట్టి జార చోరశి
ఖామణులై భూతదయాపరోపకారపాపభయంబు
లు వర్జించి వర్ణాశ్రమ ధర్మంబులుత్యజించి వి
షయభోగంబులకు విఱ్ఱవీగుచున్నారు గదా?

అదిగాక జగద్గురుండైన దేవుండు రామకృ
ష్ణాది రూపంబుల నవతరించి జీవన్ముక్తిసాధనం
బగు బ్రహ్మవిద్యను స్థాపించి అందుసగుణోపా
సనా నిర్గుణోపాసనా విధులను బోధించి సత్యమ
ద్వైతం సహజమద్వైతం అని సత్యమతంబగు
అద్వైతంబును ప్రకటించి శ్రుతియుక్తి స్వాను
భవములచే స్వరూపజ్ఞానము నుపదేశించి[illegible]
ప్రియులైన మీకు తనవివేకశక్తినిచ్చి మిమ్ము
లను పండితులగాపించియుండగా మీరు గురు
ద్రోహులై జగద్గురూపదిష్టమయిన బ్రహ్మవి
ద్యను నిరాకరించి మాయామతంబుల నవలం
బించి వర్ణసంకరకారకులై మద్యమాంస భక్ష
ణంబులును, పరస్త్రీ సంభోగంబులును, స్వేచ్ఛా
నుసారంబుగాచేయుచు వేదాంతులకుపాపపుణ్యం
బులంటవని ఆచండాలపర్యంతము అచలపరిపూ
ర్ణులమయితిమని కర్మభక్తి జ్ఞానానుష్టానంబులు

విసర్జించి వేదాంతమను దురంతముచే విధి ని
షేధములు లేక విహరించుచున్నారుగదా ?

ఇట్లు అధర్మవర్తనులై దురంతముగా వ
ర్తించు కలిజనులకు వేదాంత వేద్యుండయిన
పరమాత్ముండెట్లు ప్రసాదించును బ్రహ్మవి
ద్యాంతమైన పరిపూర్ణ మెట్లు సిద్ధించును యీ
ఘోరకలి వేదాంతమునకు యముడెట్లు స
హించును. పాపాత్ములను శిక్షించుటవలన య
ముడనియు, పుణ్యాత్ములను రక్షించుటవలన దే
వుడనియు, ప్రభువునేకదా పేర్కొనబడుచు
న్నది. పుత్రులు దుష్టులై శిక్షింప బడునపుడు
తలిదండ్రులను దూషించినను దండన మానదు
గదా ? మీరు యమదండన సహింపలేక దే
వుని మొరబెట్టినను మిమ్ములనెవ్వరును రక్షింప
లేరుగదా ? అప్పుడు మీమాయ వేదాంతుల
గతి యెట్లుండును మృత్యువునోట చిక్కినప్పుడు
గదా సత్యము గనుపించుచున్నది. ఇప్పుడైనను
మీరు వివేకము తెచ్చుకొని జగజ్జనకుండైన
దేవుండు పరమదయాళుం డగుటవలన పుత్ర
వాత్సల్యతతో మనతప్పులను క్షమించి మన

యమదండన తప్పింపుటకై మాకీ పరమధర్మము నుపదేశింపుచున్నారని గ్రహించి వర్ణసంకర వేదాంతము నింతటితో వర్జించి యీశ్వరశాసనంబులయిన వర్ణాశ్రమధర్మంబుల ననుసరించి సత్కర్మానుష్ఠానంబుల నవలంబించి న్యాయవర్తనులై జీవింపుచు యింతవరకు మీరు బుద్ధి పూర్వకముగా జేయుచున్న పాపకృత్యములకు తగిన ప్రాయశ్చిత్తము మనోవాక్కాయములచే గావించుకొని యికముందెట్టి పాపమును జేయగూడదని పరమేశ్వర సాక్షిగా ప్రమాణమొనరించి భగవద్భక్తిమార్గము నవలంబించియీశ్వరారాధన సత్కర్మానుష్ఠానంబులచేజన్మసాఫల్యమును బొందుదురుగాక. ఇట్లు కలియుగంబున మానవులకు సత్యజ్ఞానధర్మంబులు ప్రబలించుగాక.

జీవరహస్యంసమాప్తము.





శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః.

# పరమార్థ బాలబోధ

## దేవరహస్యము.

### భక్తిమార్గము.

దేవరహస్యమనగా లోకంబున ధర్మప్రవర్తములుగు నెలెవంతులును జగత్కర్తయయిన భగవంతుని స్వరూపస్వభావ మహిమావిశేషములను బోధించు భక్తిమార్గము.

ప్ర. భగవంతుడనగా యెటువంటివాడు ?
ఉ ఈచరాచరప్రపంచమును సృజించినవాడే సర్వజ్ఞుడైన భగవంతుడు.

ప్ర. ఈప్రపంచము నెందుకు సృజించెను ?
ఉ. తనవిలాసము కొరకై సృజించెను.

ప్ర. జీవసృష్టి యెన్నివిధములు ? ఉ. నర మృగపశుపక్షిక్రిమికీటకజన్మములారువిధములు.

ప్ర. ఈమానవజన్మ మెందుకేర్పడినది ?

ఉ. భగవంతుని దర్శించుటకై మానవజన్మమే ర్పడినది. ప్ర. మానవ జన్మమునకు ఆయుష్కాలమెంత ? ఉ. కలికాలము మొదలు నూరేండ్లు పరిమాణము.

ప్ర. ఈమానవజన్మములో జీవుడేమిసంపాదించవలసినది ? ఉ. ధర్మార్థకామమోక్షములలో, పరమపురుషార్థమైన మోక్షమునే సంపాదించవలసినది.

ప్ర. మోక్షమనగా నెటువంటిది ? ఉ. జీవుడు దేవుడగుటయే మోక్షము.

ప్ర. జీవుడనగా యెటువంటివాడు ? దేవుడనగా యెటువంటివాడు ? ఉ. పుట్టిచచ్చువాడే జీవుడు. పుట్టనిచావనివాడే దేవుడు.

ప్ర. జీవుడెచ్చట నుండువాడు ? దేవుడెచ్చట నుండువాడు ? ఉ. సర్వజీవులును దేవునిలోనే వశించియున్నారు దేవుడునూ జీవులలోనే వసించి యున్నాడు.

ప్ర. అట్లయిన దేవుడు మనకెందుకగుపించుటలేదు ? ఉ. జీవులకు మాయయను తెరగప్పియుండుటచే దేవుడగుపించుటలేదు.

ప్ర. జీవుడు దేవునియెట్లు దర్శింపగలడు ? ఉ. దేవుని యనుగ్రహము కల్గినవానికి దేవుడ గుపించుచున్నాడు.

ప్ర. దేవుని యనుగ్రహము జీవుని కెట్లు క లుగును ? ఉ. దేవుడు భక్తిచేతనే ప్రసన్నుడ గుచున్నాడు.

ప్ర. దేవునిభక్తియెట్లుసలుపవలెను ? ఉ. దై వభక్తియనగా స్మరణచేతను, భజనచేతను, అ ర్చనచేతను, ప్రార్థనచేతను, జపముచేతను ధ్యా నముచేతను, దేవునిప్రేమించి సేవించునదిగ నుక లోకంబున, నిజభక్తులైన స్త్రీపురుషు లు, కలౌస్మరణాన్ ముక్తిః అను భగవద్వాక్య మునమ్మి నిరంతరము, హరిస్మరణ చేయుచు, స్వప్నమందు నహా శ్రీహరిని మరువక ఆమర ణాంతము, శక్తివంచన లేక, భక్తిసలిపి భగవ దనుగ్రహమును, పొందవలెనని తాత్పర్యము.

దేవస్మరణ.

పుండరీకాక్ష పుండరీకాక్ష, శ్రీగోవింద గోవింద కేశవాయ స్వాహా నారాయణాయ స్వాహా మాధవాయస్వాహా గోవిందాయనమః

విష్ణవేనమః మధుసూదనాయనమః త్రివిక్రమాయనమః వామనాయనమః శ్రీధరాయనమః హృషీకేశాయనమః పద్మనాభాయనమః దామోదరాయనమః సంకర్షణాయనమః వాసుదేవాయనమః ప్రద్యుమ్నాయనమః అనిరుద్ధాయనమః పురుషోత్తమాయనమః అధోక్షజాయనమః నారశింహాయనమః అచ్యుతాయనమః జనార్దనాయనమః ఉపేంద్రాయనమః హరయే నమః శ్రీకృష్ణాయనమః.

శ్లో॥ గంగేచయమునేచైవ గోదావరిసరస్వతి నర్మదేశింధుకావేరీతుంగభద్రేనమోనమః ॥

శ్లో॥ అయోధ్యామధురామాయా కాశీకాంచీ అవంతికాపురీద్వారవతీచైవపుణ్యక్షేత్రానిస్మరామ్యహం ॥

శ్లో॥ కస్యపోత్రిర్భరద్వాజో విశ్వామిత్రోథగౌతమః జమదగ్నిర్వసిష్టశ్చస్మరామి ఋషిపుంగవాన్ ॥

శ్లో॥ ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక ।
వ్యాసాంబరీష, శుక, శౌనకభీష్మదాల్భ్యాం
రుక్మాంగదార్జున వసిష్టబలిర్విభీషణాదీన్ ॥

పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

శ్లో॥ అహల్యా ద్రౌపదీ సీతా తారా మండో
దరీ తథా పంచకన్యాస్స్మరేన్నిత్యం మహాపాతకనా
శనం॥

శ్రీమహాగణాధిపతయే నమః శ్రీలక్ష్మీనారా
యణాభ్యాంనమః ఉమామహేశ్వరాభ్యాంనమః
వాణీహిరణ్యగర్భాభ్యాంనమః శచీపురందరాభ్యాం
నమః అరుంధతీవసిష్ఠాభ్యాంనమః శ్రీసీతారామా
భ్యాంనమః రాధాకృష్ణపరబ్రహ్మణేనమః పితృ
భ్యోనమః మాతృభ్యోనమః గురుభ్యోనమః స
ర్వేభ్యోమహాజనేభ్యోనమః అని యిట్లు ప్రతిది
నంబును ప్రాతఃకాలంబున పరిశుద్ధదేహుండై
దేవతాస్మరణంబు జేసి శ్రీహరిస్మరణచేయు
చుండవలెను.

హరిస్మరణ.

శ్లో॥ గోవిందేతిసదాస్నానం। గోవిందేతిస
దాజపం। గోవిందేతిసదాధ్యానం। సదాగోవిం
దకీర్తనం॥

శ్లో॥ హరేర్నామ హరేరామ। రామరామ
హరేహరే। హరేకృష్ణ హరేకృష్ణ। కృష్ణకృ

ష్ణహరేహరే । ఇతిషోడశకంనామ్నాం । కలి కల్మషనాశనం ॥

శ్లో॥ హరేకేశవగోవిందా । వాసుదేవజగన్మయా । ఇతీరయంతియేనిత్యం । నహితాన్ బాధతేకలిః ॥

శ్లో॥ కృష్ణానంతముకుందమురారె । వామనమాధవగోవిందా శ్రీధరకేశవరాఘవవిష్ణో । లక్ష్మీనాయకనృశింహా । హరిపురుషోత్తమరాఘవరామా । సుందరవిగ్రహమేఘశ్యామ । గంగాతులసీసాలగ్రామ । కేశవమాధవసీతారామ ॥

శ్లో॥ రామహరే కృష్ణహరే । తవనామవదామిసదాన్నృహరే । నామస్మరణా, దన్యోపాయం । నహిపాస్యామోభవతరణే ॥ సీతావల్లభదాశరథే । దశరథనందనలోకగురో । భక్తంతే పరిపాలయమాం । రావణమర్దన, రామనమో । రామ ॥

శ్లో॥ నమామినారాయణపాదపంకజం । వదామినారాయణనామనిర్మలం । భజామినారాయణతత్వమవ్యయం । కరోమినారాయణ ।

పూజనం సదా ॥

శ్లో॥ హరినారాయణ । దురితనివారణ । పరమానంద సదాశివశంకర । భక్తజనప్రియ పంకజలోచన ॥ నారాయణత్వదాసోహం ॥

శ్లో॥ రామ రామ । రామ రామ రామ నామతారకం । రామకృష్ణ వాసుదేవ భక్తిముక్తిదాయకం । జానకీమనోహరం । సర్వలోకరక్షకం । శంకరాది గీయమాన । పుణ్యనామకీర్తనం ॥

శ్లో॥ రామబ్రహ్మసంపరసం రామనామసుధారసం రామపాదాంబుజరసం । పిబజిహ్వే నిరంతరం ॥

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం । లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం ॥

శ్లో॥ నమశ్శుద్ధాం తరంగాయ । తారకబ్రహ్మ మూర్తయే । సంసారబంధమోక్షాయ, రామాయాపన్నివారిణే ॥

శ్లో॥ హరిర్నామైవ । నామైవ నామైవ మమజీవనం । కలౌనాస్త్యేవనాస్త్యేవ॥నాస్త్యేవగతిరన్యథ

అనియిట్లుజీవుండు శ్రీహరియొక్క నామ స్మరణ కంటె కలియుగంబున మోక్షసాధనము లేదని నిరంతరము హరిస్మరణచేయుచు అనంతరము హరినామ సంకీర్తన చేయుచుండవలెను.

## హరిభజన కీర్తనలు.

కం॥ గోవిందనామకీర్తన । గావించి భయంబు దక్క । ఖట్వాంగధరిత్రీవిభుడు । మూరగొనియెను । కైవల్యము, తొల్లి । రెండు ఘడియల లోనన్ ॥

ముఖారిరాగం—ఆదితాళం.

గోవిందరాం రాం । గోపాలహరి హరి ॥ గోవింద జయజయ । గోపాలరాధాకృష్ణ ॥ గో॥

గోవిందయనిమది । భావించినిరతము సేవించెదనన్నని । చేకొనవే హరి.॥ గో॥

నీపాదములేపె । న్నిధానమనుచును । నీపాలబడితిని । కాపాడవే హరి॥ గో॥

కూరిరచిత్తుడనని । దారిచూపకనా । నేరాము లెంచుటకు. నేనెంతవాడను ॥ గో॥

జాగ్రాచోరూలచెంత జేరకనిరతము । ఆయూధిగామిమ్ముకోరి భజించెద ॥ గో॥

పాపాముచేనిపం । సాగరాబ్ధిదాటుటకు । భా
రామైతోచిమిమ్ము । జేరానలసెహరి॥గో॥

ఖరహరప్రియరాగం—ఆదితాళం.

రామరామా శ్రీరామా । శ్రితకామా ప
రంధామ ॥రా॥ రామఅంటి మహిమగంటి ।
శరణంటి, కావుమంటి॥రా॥ రామపద్దా, తప్పవ
ద్దా। ఏపొద్దూమరువవద్దా॥రా॥ రామఆరు । రి
పులపోరు।తీర్చేవారు యిపుడున్నారు॥రా॥ రా
మనామభక్తపాలా। నన్నుబ్రోవవేలా. లక్ష్మిలో
లా॥ ॥రా॥ రామచాలు జాలంచాలు నాతల
వ్రాలు, కాబోలు॥ రా॥ రామరాయ, త్యాగ
రాయ। సీమనసురాయ। కరుగదాయ ॥రా॥

జౌళిరాగం—ఏకతాళం.

శ్రీరామా శ్రీరామా। శ్రీమనోహరరామా
ముల్లోకాధారామా ముత్యాలహారామా।శ్రీ
ఏదయా నీదయా। యింతైనరాదాయా॥శ్రీ॥
ఇప్పుడే లేదాటా। ఇకను బ్రోతూవాట ॥శ్రీ॥
రాజాధిరాజితా। త్యాగరాజనుత ॥శ్రీ॥

మధ్యమావతిరాగం—ఏకతాళం.

రామనామభజ। హేమానన॥ రామ॥

దాంగరీతి తిరుగంనేల। శ్రీరంగని పదములు కౌగలించుకుని॥ రా॥ ఎక్కడైనహరి యెక్కడనుచు। మది చక్కదనముగని మ్రొక్కసంతతము॥ రామ॥ దేహమెత్తినం దేహపడక। వైదేహిభాగ్యమును। దేహిదేహియని॥ రా॥ రాగరోష భవరోగరహిత। నినువినా గతెవ్వరిక। త్యాగరాజనుత॥ రా॥

యమునాకళ్యాణిరాగం — ఆదితాళం.

రామకృష్ణగోవింద నారాయణా। కృష్ణరామగోవింద నారాయణా॥ రామకృష్ణాయని ప్రేమతో బిలచినపుడు। మోమైనజూపవేమి నారాయణా॥రా॥ అంబుజవాహన-పుండరీకాక్ష నీ। యండజేరి యుంటినయ్య నారాయణా॥రామ॥ వాసుదేవముకుంద-వనమాలిచక్రధారనారాయణా॥రామ॥ మందారగిరిధర సుందరాకారశ్రీ నందకుమారశ్రీమన్నారాయణ॥రా॥ పతితుడననిమిమ్ము - బ్రతిమాలుకొన్న। శీతాపతినన్ను గావవేమి నారాయణా॥రామ॥రామదాసునిబ్రోచె-ప్రేమతో భద్రశైల ధాముడైన శ్రీమన్నారాయణా॥రామ॥

నాదనామక్రియరాగం — ఝాఫుతాళము

గోవిందాసుందర మోహన దీనమందార గరుడవాహన! భవబంధాది దుష్కర్మదాహన భక్త వత్సల త్రైలోక్యపావన ॥గో॥ సతిసుతుం పైప్రేమరోసితి। బహుగతులనీపై భారమేసితి। మదినిమ్ము చూడగగోరితి మీదయకెప్పుడెదురుజూచితి॥గో॥ చాలాదినములనుండి వేడితి కాలహారణము చేసివిడనాడితి మేలౌనీనామాముజాడితి మెరసి ముందొక్కవిధమున వేడితి॥గో॥ దీనరక్షకుడానివిందును పతీగున మోక్షమునుగందును మానసమున నమ్మియుందును నా-మనవిచేకొనవేమందును ॥గో॥ అధికుడవనినమ్మినందుకు ఆశ్రయించితేశ్రమపెట్టెదెందుకు మదినిమ్ముగొలిచేది యెందుకు। మాకిదిపూర్వకృతమానటందుకు ॥గో॥ దాపైవచ్చెవార్ధక్యము। యికపాపెవ్వరు సామీప్యము। ఎంతని వినిపింతుగోప్యము। మీరెప్పుడుచూపెదరు సాయూజ్యము ॥గో॥ భద్రగిరియందున లేవేమో ఊనికినిజమైతె మొరవినిరావేమో కరినిగాచిన హరివిగావేమో రామదాసుని మొరవినిరావేమో॥గోవింద॥

నాదనామక్రియ రాగం—ఏకతాళం

శ్రీరామనామం-మరువాం మరువాం । సి
ద్ధాముగ ముక్కి వెరువాం వెరువాం ॥శ్రీ॥ వి
ష్ణుకథలు వినుచుందాం వుందాం। వేరేకథలు చె
వుల మందాం ముందాం॥ శ్రీ॥ గోవిందునే వేళ
గొలుతాం గొలుతాం। దేవునిగుణములు దలు
తాం-దలుతాం॥శ్రీ॥ మాధవనామాం మరువాం
మరువాం। మరియమబాధకు వెరువాం వెరు
వాం ॥శ్రీ॥ అవనీజపతి సేవ మానాం మానాం।
మరియొకజోలం బుమానాం మానాం ॥శ్రీ॥ నా
రాయణుని మేము నమ్మేం నమ్మేం। నరులానుయి
క మేము నమ్మాం నమ్మాం ॥శ్రీ॥ రామదాసు
లుమాకు, నారాం నారాం। రామదాసులు
మాకుదూరాం దూరాం॥శ్రీ॥భద్రిగిరీసునికందాం
కందాం భద్రముగామనముప్పుందాం వుందాం॥

శంకరాభరణరాగం—ఆదితాళం-

ఉంటేనేమి-పోతేనేమి రామాయనని వాడుం
టేనేమి పోతేనేమి। నోరునొవ్వగనొక్క-సారి
గోవిందాయని పేరుబల్కనియా-కుండ్రనరుడు
భువిలో ॥ఉం॥ నీమాయమోడరావానామా ఖడ్గ

దిరావ్యాపయ సుందరాకార పరశీలనా। పరాకే
లయిందురారశ్రీ-కృష్ణరాయపురిపాలనా ॥వ్యా॥
సరాళముగ శేషాచలదాసుని మొరాలించకృప
రాదుగా సకేసీవు మోసగాడవని మొహార్ ర్ఘు
శ్రీకేతునిక మీదుగా ॥వ్యా॥

(11) ఆనందభైరవిరాగం —చాఫ్ తాళం.

రామరామ రామరాగదే। భద్రశైల ధా
మనిన్నె నమ్మినాగదే॥ రా॥ భూమిజామనోభిరా
మ రామవిజయభీమకామ। శ్యామసద్గుణ ధా
మ తారక నామరాఘవ॥ రా॥ మోముజూపకం
తకోపమా। లేక నేను మున్ను చేసుకున్న పాపమా।
సామజేంద్రవరదనా స్వామీ వెసీవాని వేమారు
వేడితి। నా మొరాలించినన్ను। ప్రేమసీ-డెమన-
వేమిది-న్యాయము ॥రా॥ పిలిచినానుపలుక వేమ
యా। భక్తులందు అలుకశ్యాయమేరగాదయా।
అలవిగాని మోహపాశములను జుట్టి శతృలాంఘ్ర
దు। చెలగితాపత్రియుడవనుచు భూవలయము
న నిలువదోలిరి॥ రా॥ శేరదీసి జారవిడతు
రా॥ సేవకులను గారవించి కరుణనేలరా। సాశ
స్తారతు భద్రశైల నారశింహాయనుచునిన్నుకో

చిలచినానురావు నేరేమి భారము దూరమా కోదండ ॥ రామ॥

బౌళిరాగం—ఏకతాళం.

రామా-రామరవికుల- సోమసుందర- కావు మేఘశ్యామ- లక్ష్మీనాయకా- మోక్షదాయకా ॥రామా॥ దిక్కునీవని మొర్రిక్కవేడితి పక్కజా యుకరార-వైకుంఠాపతీ జానకీపతి ॥ రామా॥ న మ్మినందుకు సార్థకమునిను రమ్మపొమ్మని బిలు వనానోరాడదూ మనసుపీడాదూ॥రామా॥ దారి దెలియక ఘోరసంసారవాంధిలోన మునుగుచు నుంటిరా। దరిజేర్చుమంటిరా ॥ రామా॥ ధరణి చోళపురీశచిన్మయ దాసహృదయములోన మె లగుచు నుండరా వరకోదండరా॥ రామా॥

ధన్యాసిరాగం—ఆదితాళం.

పరాకు జేయుట పాటిగాదురా ॥ పరమపురు షవరదా॥ విరానబ్రోవక నిరాకరించుట బిరుదు నీకెతగునా। వరదా ॥ప॥ నాథులపాలిటి సౌ భాగ్యంబనిచాలనమ్మినారా। వేదవేద్యనీవేదిక్క నిమది। నెంచితినగధీరా వరదా ॥ప॥ గజపతిబ్రో చినఘనుడవనుచు నీభజనసగోరినారా। అజమర

మునులకు ఆధారుడవని ఆశ్రయించినా రా వ
రద ॥ప॥ వరకాంచీపుర వాసపరదపను । వదలు
టయిదిమేరా। అరనిముసము నిన్నెడ బాసియు
నే నాపడబడలేరా వరదా ॥ప॥

మంగళహారతి

రామచంద్రాయ జనక రాజజా మనోహ
రాయ మామకాభీష్టదాయ మహితమంగళం॥
కౌసలేయాయ మందహాసదాసపోషణాయ వాస
వాదివినుత సద్వరదమంగళం॥ చారుకుంకుమో
పేతచందనానుచర్చితాయ హారకటక శోభితా
య భూరిమంగళం॥ లలితరత్నకుండలాయ తుల
సీవనమాలికాయ జలదసదృశదేహాయ చారు
మంగళం దేవకీపుత్రాయ । దేవదేవోత్తమా
య । భావజాగురువరాయ భవ్యమంగళం పుం
డరీకాక్షాయ పూర్ణచంద్రాననాయ । అండజా
వాహనాయ అతులమంగళం । విమలరూపాయ
వివిధవేదాంతవేద్యాయ। సుముఖచిత్తకామితా
య సుభగమంగళం। రామదాసమృదుల హృద
య తామరసనివాసాయ। స్వామిభద్రగిరి వరా
య। సర్వమంగళం॥

# పూజావిధానము

శ్లో॥ పూజాకోటిసమంస్తోత్రం। స్తోత్రకోటిసమం జపః। జపకోటి సమంధ్యానం। ధ్యానకోటిసమోలయః॥ అనునట్లుదేవతార్చనకొరకు పూజా స్తోత్రము జపము ధ్యానము లయము అను పంచవిధులేర్పడి యుండుటవలన లోకంబుననిజ భక్తుడు మోక్షదాయకులైనశివ, కేశవులలో తనకిష్టమైన మూర్తినీనమ్మి యీపంచవిధులచే తను నిరంతరము తనయిష్టదైవమును విగ్రహ రూపంబునభావించి ఆమూర్తిని షోడశోపచారంబులచే పూజించునదిబాహ్యపూజనిన్నీ యీమూర్తిని హృదయంబున పూజించునది మానసపూజనిన్నీ చెప్పబడుచున్నది గావున నిజభక్తులునిరంతరము ప్రాతఃకాలంబున కృతస్నానులై చిత్తశుద్ధికలిగి తనయిష్టదైవమును తనయెదుట విగ్రహరూపంబున స్థాపించి కేశవాదినామంబులను స్మరించి తనగోత్రనామములను వచించి మమజన్మకర్మసర్వపాప నివృత్త్యర్థం। శ్రీపరమేశ్వరముద్దిశ్య, శ్రీపరమేశ్వరప్రీత్యర్థం మమయిష్టదేవతా శ్రీరామచంద్రపూజాంకరిష్యే

హనుమత్సితాలక్ష్మణభరత శత్రుఘ్న పరివారస
మేత శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః ధ్యా
యామి, ఆవాహయామి, స్వర్ణసింహాసనంస
మర్పయామి, పాదయోః పాద్యం హస్తయోః
అర్ఘ్యం, ముఖేఆచమనియ్యంపంచామృతస్నా
నం, శుద్ధోదకస్నానం స్వర్ణపీతాంబరం, య
జ్ఞోపవీతం దివ్యశ్రీచందనం, దివ్యాభరణాన్ సు
గంధపుష్పాణి పూజయామి। అథాంగపూజా॥
కేశవాయనమః ఓం పాదౌపూజయామి, నా
రాయణాయనమః ఓం గుల్ఫౌమాధవాయనమః
ఓం జానూ, గోవిందాయనమః ఓం ఊరూ, వి
ష్ణవేనమః ఓం కటిం, మధుసూదనాయనమఃఓం
నాభిం, త్రివిక్రమాయనమః ఓం ఉదరం, వామ
నాయనమః ఓం హృదయం శ్రీధరాయనమఃఓం
వక్షంహృషీకేశాయనమః ఓం స్తనౌ, పద్మనా
భాయనమః ఓం భుజౌ, దామోదరాయనమః
ఓంహస్తౌ, సంకర్షణాయనమః ఓం హస్తాంగు
ళీం, వాసుదేవాయనమః ఓం కంఠం, ప్రద్యు
మ్నాయనమః ఓం చుబుకం, అనిరుద్ధాయన
మః ఓం నాశికాం, పురుషోత్తమాయనమః ఓం

దంతాన్ అథోక్షజాయనమః ఓం ఓష్టౌ, నార
శింహాయనమః ఓం శ్రోత్రౌ, అచ్యుతాయన
మః ఓం నేత్రౌ జనార్ధనాయనమః ఓం లలాటం
ఉపేంద్రాయనమః ఓం తిలకం, హరయేనమః
ఓం శిరః శ్రీకృష్ణాయనమః ఓంసర్వాం గాని
పూజయామి, ధూపమాఘ్రాపయామి, దీపంద
ర్శయామి ఆచమనీయం సమర్పయామి, షడ్రి
సోపేతమహానైవేద్యం సమర్పయామి, హస్తౌ
ప్రక్షాళయామి, పాదౌప్రక్షాళయామి శుద్ధాచ
మనీయం, సమర్పయామి, కర్పూరనీరాజనం స
మర్పయామి, సువర్ణమంత్రపుష్పం సమర్ప
యామి, ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్ప
యామి, ఉద్వాసనంసమర్పయామి, శ్లో॥ యా
నికానిచపాపాని। జన్మాంతరకృతానిచ। తాని
తాని ప్రణశ్యంతి। ప్రదక్షిణ పదేపదే। పా
పోహం పాపకర్మాహం। పాపాత్మాపాపసంభ
వః। త్రాహిమాం కృపయాదేవ। శరణాగత
వత్సల॥ అన్యథాశరణంనాస్తి, త్వమేవశరణం
మమ। తస్మాత్కారుణ్యభావేనరక్షరక్షజనార్ద
న॥ అనియిట్లు ప్రతిదినంబును, తనయిష్టదైవ

మును సభక్తిపూర్వకంబున బూజించి, అనంత రంబున దైవప్రార్థనంబు చేయవలయును.

దైవప్రార్థన.

శ్లో॥ శ్రీరామచంద్రాశ్రితపారిజాత। సమస్తకల్యాణగుణాభిరామ। సీతాముఖాంభోరుహచంచరీక। నిరంతరం మంగళ మాతనోతు ॥

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకా, ఆదిమధ్యాంతరహిత, ఆపద్బాంధవ, అనాథరక్షక, అక్రూరవరదా, అంబరీషవరదా, గజేంద్రవరద, ప్రహ్లాదవరదా, దీనరక్షకదీనపోషక, భక్తవత్సల, భవరోగవైద్య, వేదాంతవేద్య పురాణపురుషోత్తమ, దేవతాసార్వభౌమ, కరుణాసముద్ర, దీనమందార, ప్రణతార్తిభంజన, పాదోధిశయన, సత్యలోకశరణ్య, సచ్చిదానందరూప, సర్వభూతాంతరాత్మ, ముక్తిప్రదాయక, భక్తజనకల్పద్రుమ, పాహిమాం పాహిమాం రక్షమాం రక్షమాం, అనియివ్విధంబున పరమేశ్వరుని నిరంతరంబును ప్రార్థింపుచు పరమేశ్వర సన్నిధానంబు గల్పించుకొని, మానసంబున యిష్టదేవతాభివందనంబులొనర్చి

అనంతరంబున నామమంత్రంబును జపింపవలయు.

జపవిధానము.

శ్లో॥ దైవాధీనం జగత్సర్వం । మంత్రాధీనంతు దైవతం।తన్మంత్రం బ్రాహ్మణాధీనం। బ్రాహ్మణోమమ దేవతా ॥ అనగా సర్వప్రపంచము భగవంతుని యధీనమై యుండుననిన్నీ, ఆ భగవంతుండు తన్మంత్రమున కధీనమై యుండుననిన్నీ ఆమంత్రము బ్రాహ్మణోత్తముల కధీనమై యుండుననిన్నీ అట్టిబ్రాహ్మణోత్తముడు జగద్గురువనిన్నీ శ్లో॥ జయతుజయతుమంత్రంజన్మసాఫల్యమంత్రం । జననమరణభేదక్లేశ విచ్ఛేదమంత్రం । సకలనిగమమంత్రం సర్వశాస్త్రైకమంత్రం । రఘుపతినిజమంత్రం। రామరామేతిమంత్రం ॥ అనగా భగవంతుని యనంతనామములలో శ్రీరామ నామమంత్రము, జీవులను, జన్మసాఫల్యము జెందించునదిన్నీ జననమరణను ముద్రమును దాటించునదిన్నీ అగుటవలన యిది. తారకమంత్రమనబడుచున్నది. గావున నీతారకమంత్రమును మంత్రసిద్ధులైన సద్బ్రాహ్మణులవలన గ్రహించి నిరంతరము నిశ్చలభక్తి

తోజపించి మంత్రఫలమును భగవదర్పణముశే యుచు అనంతరముహరిధ్యానము చేయవలెను.

హరిధ్యానము

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభంసురేశం। విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం। లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం వందే విష్ణుంభవభయహారం సర్వలోకైకనాథం.

శ్లో॥ సశంఖచక్రం, సకిరీటకుండలం, సపీతవస్త్రం॥ సరసీరుహేక్షణం। సహారవక్షస్థలకౌస్తుభశ్రియం, నమామివిష్ణుం సిరసాచతుర్భుజం॥ అనగా జగద్రక్షకుండైన భగవంతుడు, శ్రీమహావిష్ణువగుటవలన, ముముక్షుండయిన జీవుండు, శ్రీమహావిష్ణువును, తనయిష్టదైవముగనమ్మి, ఆదివ్యమంగళ విగ్రహంబగు చిత్రపటమును, తనయెదుటనుంచుకొని స్వామిసాన్నిధ్యంబున, భయభక్తివిశ్వాసంబులతో, కూర్చుండి శ్రీహరిదివ్యమంగళ స్వరూపంబును నేత్రోత్సవంబుగా, దర్శించిపాదాదిశిరః పర్యంతము సర్వావయువంబులును మకరకుండల కిరీ

టాది సర్వాభరణంబులును శంఖుచక్రగదా ద్యాయుధంబులును, ప్రత్యేకంబుగా, దర్శించు, పాదంబులనుండి, శిరంబువరకు ఒక్కొక్క అవయవంబునందు, తనమనంబును, నిలిపి ఆ యాచిహ్నంబులను, జూచి సంతసింపుచు, అచ్చటనుండి మఱియొక అవయవంబునందు నిలిచి ఆచిహ్నంబులను జూచుచు యిట్లుస్వామి సర్వాంగములను దర్శింపుచు, ప్రతిదినంబు సేవింపుచుండిన కొంతకాలంబునకు. తనమనంబు భగవధ్యాన పరవశత్వమ్మున తన్మయంబు, జెందుచుండును. అటుపిమ్మట ఆదివ్యమంగళమూర్తిని, తనహృదయపీఠంబున నిలుపుకొని సర్వాంగంబులును మానసంబున ధ్యానింపనారంభింపవలయును అట్లుధ్యానించుటకు తనయెదుట చిత్రిపటమునందున్న మూర్తిని ముందునేత్రములలో దర్శించి పిమ్మట ఆమూర్తిని హృదయంబున దర్శింపనభ్యసించి, నిశ్చలభక్తియోగంబు సిద్ధించువరకు నిరంతరధ్యాననిష్ఠ సలుపవలయు. ఇట్లుధ్యానపూజన వందనాదులచే భగవంతుని నారాధించిన భక్తవత్సలుండైన భగవంతుండు

తనభక్తికి సంతసించి. సీ॥ శ్రీకరరత్నసింజిత నూపురస్ఫుర పాదపద్మంబులు బరగువాని। కాంచీకలాపసంకలితకటిస్థలి కాంచనచేలంబు గలుగువాని। గ్రైవేయుగంబులుకమనీయహారము ల్ కంకణాంగదములుగలుగువాని। మకరకుండలరత్న మహనీయమకుట సన్మందహాసవిలాస మహిమవాని। భరతలక్ష్మణశత్రుఘ్న పవనసుతులు। గొలువజానకితోఁగూడి కొమరుమిగుల నట్టిశ్రీరామమూర్తినే నాత్మలోన। మిగుల కలగంటినంతట మేలుకొంటి॥ అని యివ్విధంబున, భక్తవత్సలుండైన భగవంతుండునీతాసమేతుండై, తనపరివారంబుతో అంతరంగంబున ప్రసన్నుండై సాక్షాత్కరించిన జీవుండు తన యిష్టదైవంబును దర్శించి పరమానందంబు నొందినంత భగవంతుండంతర్థానంబైన కలగనిమేలుకొన్నట్లు భక్తుండుబహిర్ముఖుండై తనయిష్ట దైవమును తలంచుకొని యానందించుటయే ధ్యానయోగమని తాత్పర్యము,

దేవరపాన్యము,

సంపూర్ణము.



శ్రీరస్తు.

# గురురహస్యము.

## జ్ఞానమార్గము.

శ్లో॥ వందేగురూణాం చరణారవిందే । సందర్శిత స్వాత్మసుఖావబోధే । జనస్యయే జాంగలికాయమానే । సంసారహాలాహలమోహశాంత్యై ॥ అనగా జగత్కర్తయైన భగవంతుడే సద్గురురూపంబును ధరించినవాఁడై నిజభక్తుండయిన జీవునకు ఆత్మబోధవలన స్వస్వరూపమును జూపించి, సంసార దవానలమును హరించుటవలన పరమగురుని పాదారవిందములకు నమస్కరించి పరమాత్మతత్వము ప్రకటింపఁబడుచున్నదని తాత్పర్యము.

## స్వస్వరూప స్వయంబోధిని.

శ్లో॥ స్వయంవ్యక్తం స్వయంవ్యాప్తం । స్వయంజ్యోతి స్వయంప్రభా । స్వయంవేద్యం స్వయంబోధ్యం । స్వయంబ్రహ్మ స్వయంగురుం ।

అనగా దేహధారియైన జీవునకు ఆత్మనిజరూప

మున్నూ, మనస్సుమాయారూపమున్నూ అగు టవలన దేహము తానని తోచబడుచుండగా ఆత్మ తానని తోచబడదు. ఆత్మనగా స్వయంభువై తనంతటతానే ప్రకాశింపుచు సర్వము తానే గ్రహింపుచు సర్వజగత్తును తానే వ్యాపించి సర్వజీవులలోను సర్వసాక్షియై వెలయుచున్న పరంజ్యోతి స్వరూపమున్ను, ఆ పరంజ్యోతియే పరబ్రహ్మమున్ను ఆపరబ్రహ్మమే పరమగురు వున్ను, శ్రుతియుక్త్యనుభవములువలన నా అస్పష్టమైనందున నాస్వరూపానుభవమును బోధించిన జీవులకు స్వానుభవమగునట్లు సద్గురుం డుపదేశించుచున్నాడని తాత్పర్యము.

క॥ ఒక్కడు యుక్తిలోనున్నది తెల్పించుట్టి చదువుపోరు పెట్టిగాదె। నేను నేనటంచు నరసిన తెలియదా తానుగాక వేరు తానుగలడె॥ అనునట్లు సర్వజీవులలోను నేనునేనని పలుకుచున్న వస్తువేదియో యావస్తువును తనదేహములోతానే విచారించి, తననిజరూపమును తాను గ్రహించునదే తనకు మోక్షము.

గనుక తాననగా యేది? మొదట దేహమే

తానని తోచుచున్నది. దేహమెట్లు వచ్చిపోవు చున్నది? ఒక దేహములోనుండి చేతనమై వచ్చి జడమై పోవుచున్నది. గనుక చేతనవస్తువు తా నుగాని జడవస్తువు తానుగాదు. చేతనమనగా నేమి? జడమనగా నేమి? జ్ఞానముకలది చేతన ము. జ్ఞానములేనిది జడము. ఈ రెంటిలో తానే ది? ఈ రెండును కలిసియున్నప్పుడే నేననుచు న్నది, గాని కలియనప్పుడు తాను లేదు అయితే చేతనమైన తనకున్ను జడమైన దేహమునకున్ను సంబంధమెట్లు కలిగినది? చిజ్జడవస్తువుల రెంటికి మాయావలన సంబంధముకలుగుచున్నది చేతన మనగానేమి? చేతనమే జీవుడనబడుచున్నది. జీ వుడనగానేది? శ్వాసరూపమై చలించునదే జీ వుడు. యీశ్వాస దేనివలన చలించుచున్నది? దేహమందు ఆకర్షణశక్తియుండుటవలన ప్రాణ వాయువు చలించుచున్నది ఈదేహమునువిడచి ఈప్రాణమెట్లుపోవుచున్నది? ఆకర్షణశక్తి అం తరించిన శ్వాసనిలచి పోవుచున్నది ఆకర్షణశ క్తియనగా నెటువంటిది? గడియారపు యంత్ర మువలె దేహమందుండి ప్రాణమును చలింప

చేయునది గాని ఎచ్చటనుండివచ్చినదో, యే రూపమైనదో, యీమాయ యెవరికిని తెలియదు అయితే తానైనవస్తువు ఆకర్షణశక్తియే నా ? ఆకర్షణశక్తియును దానివలన చలించెడు ప్రాణవాయువును దేహమువలెనె జడవస్తువులుగాని తానైనవస్తువుకాదు అట్లయిన తానైనవస్తువు మరియేది ? యిది దేహము యిదిహంస యిదిశక్తి అని తెలియుచున్నవస్తువే తాను. నశ్వమును తెలుసుకొనుచున్న వస్తువేది ? తెలివిరూపమై తెలుసుకొనుచున్న జ్ఞానవస్తువె తాను. అట్లయిన యీతెలివికిని శ్వాసకున్ను సంబంధమేమి ? తెలివియున్నపుడును లేనపుడును హంస తనంతటతానే చలించుచున్నది. అటువలెనె తెలివియును తనంతటతానే జాగ్రతలోవచ్చి సుషుప్తిలో పోవుచున్నది గనుక తెలివికిని హంసకును పరస్పరసంబంధములేనట్లున్నది. అయితే ఈరెంటిలో ఆధారమైనదేది ? దేహమును విడిచి ఏదిముందుపోవుచున్నది ? దీపమారిపోయినపిమ్మట ఆయగ్నిమరికొంతసేపుండి అంతరించినట్లు దేహమునువిడిచి తానైనతెలివియుం

చూపోయినపిమ్మట జడమైనహంస మరికొంతసే
పు చెంలిపుచుండి ఆకర్షణశక్తి హరించినపుడు
హంసచలన మాగిపోవుచున్నది. గనుక తెలిఃపో
యినపుడు శ్వాసయుండిన నుసుషుప్తివలెనే శూ
న్యమగుటవలననదిమరణావస్థయనబడుచున్నది.
సర్వమును తానెరుగుచున్న యీతెలివి తన్ను
తానెందుకెరుగదు? తానైనఈతెలివి దేహేం
ద్రియాదులలోగలసి దేహస్వరూపమై పిపీలికాది
బ్రహ్మపర్యంతమును గల సర్వశరీరములలో
నుండి మాయాప్రపంచ మహేంద్రజాలములో
జిక్కుబడుటవలన, తన్ను తానెరుగక తల్లడించు
చున్నది. అయితే జాగ్రతమొందున్న తెలివి సు
షుప్తిలో ఎచ్చటికిపోవుచున్నది? ఏమైయుంటు
న్నది? తానైనఈతెలివి ఈదేహములోకి ఎప్పు
డువచ్చినదో ఎట్లువచ్చినదో ఎందుకువచ్చిన
దో ఈజాగ్రతలో నుండిసుషుప్తిలోనికి తానె
ట్లుపోవుచున్నదో ఎందుకు పోవుచున్నదో యే
మైయుంటున్నదో? తనమొదలు తనకే తెలియ
కున్నది. తనమొదలు తానెరుగుటయే తన్ను
తానెరుగుట. తన్ను తానెరుగుటయెట్లు?

[illegible] ప్రవక్ష్యామి యదుక్తం గ్రం
[illegible]। బ్రహ్మసత్యంజగన్మిథ్య జీవోబ్ర
హ్మైవ కేవల:॥ అనునట్లు జీవుడైన తాను బ్ర
హ్మమనిన్ని తనకు దృశ్యమైన జగత్తుమిథ్యనిన్ని వే
దాంతశాస్త్రమువలన తనకు తెలియబడుచున్న
ది. గాని తానైన బ్రహ్మవస్తు వెంత చిత్రమైన
దో యెంతపరిమాణముగలదో తనస్వరూప స్వ
భావములు తనకే గోచరించుటలేదు తనస్వరూ
పమును తానుచూచినప్పుడుగాని తనజీవభ్రాంతి
నశింపనేరదు, అట్లు తనస్వరూపమును దర్శించు
టకు జాగ్రతలో దేహమడ్డమైయున్నది. సుషు
ప్తిలో తానే లేకపోవుచున్నది అందువలన త
నస్వరూపము తనకే అదృశ్యమైయున్నది. జా
గ్రతయందు తెలివి దేహములో కలిసియుండుచు
న్న సుషుప్తియందు దేహముండి తెలివిలేక
పోవుచున్ను యీరెండుమార్గములు సర్వత్రా
కలుగుచున్నవి గాని తెలివుండి దేహము
లేని మార్గ్గముకలుగుటలేదు అట్టిమార్గమునే తు
ర్యావస్థని చెప్పబడుచున్నది. అట్టితుర్యావస్థ
ను పొందుటకు అంతర్లక్ష్యమని హంస స్తోత్ర

మని రెండుసాధనము లేర్పడియున్నవి.

అంతర్లక్ష్యమనగా తనమనస్సును ఊర్ధ్వకుండలీస్థానంబున నిలిపి ఉపజించు ప్రాణదర్శనపూర్వకము, నిరంతరాభ్యాసముచే నిశ్చలసమాధియందు నిలువనేర్చినతన మనం బాత్మయందు లయించి సచ్చిదానందబ్రహ్మమైన తనస్వరూపము సర్వసాక్షియై సాక్షాత్కరించుచున్నది.

హంససూత్రమనగా, ఉశ్వాస నిశ్వాసరూపంబయిన జీవహంసలో తనమనంబును గలిపి, రేచకపూరకంబులను మఱపక యొనరఁగలిగి, హంసగమనంబుచేయ నేర్చిన, కొంతకాలంబునకు మనోమారుతంబులు రెండును గలసి ఆత్మయందైక్యము నొందుచుండును. అప్పుడెన స్వాంత్రియాతీతంబైన సర్వసాక్షిత్వంబు సిద్ధించి అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారంబగుచుండును.

ఇట్లు స్వాంతరచిత్సమాధియందు తానైన యీ తెలివిసర్వసాక్షిత్వంబు జెంది సచ్చిదానందరూపంబై తన్ను తా నేదర్శించి తనలో తానే సంతసించి, అచ్చటనుండి తుర్యాతీతంబై సాక్షిరహితంబుజెంది మరల యథాప్రకారంబున దే

స్వారూపంబై జాగరణంబునకు వచ్చుచున్నది. అందువలన జీవుడు బ్రహ్మమైనట్లున్నూ జగత్తు మిధ్యైనట్లున్నూ తనకు ప్రత్యక్షానుభవమైనం దున దేహముతాననే జీవభ్రాంతి తక్షణమే నివర్తించుచున్నది. లోకంబున బ్రహ్మవేత్తలకు [illegible]త్మైకార్యానుభవమె దుర్ఘటమగుచుండును. యీతుర్యానుభవముకలిగినజీవుడుగాని వార్తిక బోధకర్తుడుకాడు యిట్లు సాధనసంపన్నుండైన పూర్ణాధికారి యిటువిమ్మట తనస్వరూపానుభవమునువిమర్శించినసహజామనస్క-రాజయోగానుభవంబైన నిర్వికల్పసమాధిని పొందవలయును.

సహజామనస్క- నిర్వికల్పసమాధి యనగా తత్వమసి యనుమహావాక్య ప్రమాణంబున తత్పదార్థమైనబ్రహ్మమునకున్ను త్వంపదార్థమైన జీవునకున్నూ సహజమైయున్న యేకత్వమును గురుముఖముగా గుర్తెరిగి తానెపుడును చలింపనిబ్రహ్మమై ప్రకాశించుటయేగనుక తానింత వరకు అనుభవించినభక్తి జ్ఞానక్రియలను విచారింపగా తానైన యీతెలివి. మొదటిభక్తి యోగ మందు దేవుడు తానై తన్నుతానే

పూజించుకొని జీవుడుతానై తనకంటె దేవుడు వేరని దేవునిజూచి ఆనందించుచున్నది.
పిమ్మట తుర్యసమాధి యందు తానైనయీతెలివి బ్రహ్మముతానై జీవుడుతానై తాను బ్రిహ్మములోకలిసి బ్రహ్మము తానైతినని సంతోషించి మరల సమాధినివిడచి మునుపటి స్థితికివచ్చుచున్నది- గనుక తానైన యీతెలివి బ్రహ్మములోగలసి, బ్రహ్మము కాలేదన్ని స్వయముగా తాను బ్రహ్మముగుటకు బ్రహ్మ లక్షణములు తనయందు లేవనిన్ని స్పష్టమగుచున్నది బ్రహ్మమనగా సంకల్పవికల్పములున్నూ మెరుకమరుపులున్నూ రాకపోకలున్నూ జననమరణములున్నూ సుఖదుఃఖములున్నూ లేనిదన్ని యేకవస్తువును తనలో కలుపుకొననిదిన్ని తాన్యొకవస్తువులోకలియనిదిన్ని, అయినందున తానైన యీతెలివికిన్ని బ్రహ్మమునకున్నూ ఐక్యమెకనుపించుటలేదు. ఈతెలివినిమాయయనినిషేధించిన బ్రహ్మత్వమును పొందవస్తేలేదు. ఈతెలివి బ్రహ్మముగానట్లు యిదివరకె పూర్వపక్షమైనది. ఇట్లు సర్వము తానై

తానేమియునుగాకయున్న, యీతెలివిని అద్వై తులుబ్రిహ్మమని గ్రిహించిన, బ్రిహ్మము తానగుటలేదా. ఈతెలివిని అచలవేదాంతులు మాయయని, నిషేధించిన తానుమాయమైపోవుట లేదు గనుక ఈతెలివికంటు మాయాబ్రిహ్మములు వేరుగాలేనట్లు తోచబడుచున్నది. స్వానుభవమును విచారింపగా సంకల్పమె మాయయనిన్ని సాక్షియె బ్రిహ్మమనిన్ని. యీతెలివిచేతనే తెలియబడుచున్నదిగాని యీతెలివిలేనపుడు ఇది సంల్పమని ఇదిసాక్షియని తెలియబడుటలేదు. అందువలన బ్రిహ్మానుభవమునగా శ్రు॥ నారాయణ పరంజ్యోతి। రాత్మానారాయణః పరహా॥ అనునట్లు పరంజ్యోతి స్వరూపము యీతెలివి కధిస్టానమై, తెలివి యున్నపుడును లేనపుడును తాను స్వయంవ్యక్తమైయున్నదో అనిష్ప్రితియోగికబ్రిహ్మము తానైనట్లు, తనకు వైరాయనుగ్రిహమువల తెలియవలసినదే గాని, యీబ్రిహ్మరహస్యము బ్రిహ్మదులకైనను భేదింప సక్యముగాదని తాత్పర్యము.

గురురహస్యము సంపూర్ణము.

